## గంటల పంచాంగం

శ్రీజయ సంII ఆశ్వయుజ శుII పంచమి 1954 సంII అక్టోబరు 2 శనివారం శుపంచమి 17-58 అనూ 20-14 వర్జ్యం రా2-30 ల 4-17 కు.

శుII షష్ఠి అక్టోబరు 3 ఆదివారం ఆII షష్ఠి 20-21 జ్యేష్ఠ 23-4 వర్జ్యం లేదు


# ఆంధ్రపత్రిక

ఒరు లేయుడి యొంపరించిన సరసత యుప్రియయు తన సుకుంతున కగి శా వాడులకు వవిపేయుకునికి సురాయులము వరమధర్మవలయులొకొల్లప్.(మహాభారతము

శ్రీ జయ సంII ఆశ్వయుజ శుII పంచమి శనివారం


## విదేశాంగ విధానం

రాజ్యసభ, లోక్‌సభ ఎప్పుడుసమావేశమైనా, సమావేశాల ప్రారంభంలోనో, సమావేశాలు సమాప్తమయ్యే ముందో విదేశాంగ వ్యవహారాలను చర్చించటం సంప్రదాయమైనది. ఆ సంప్రదాయాన్ని అనుసరించి లోక్‌సభ మళ్ళి దేశీక విధానాన్ని చర్చించినది. రెండు రోజుల చర్చానంతరం వైదేశిక విధానాన్ని ఆమోదించినది. ఈ చర్చలవల్ల మన వైదేశిక విధానానికి సంబంధించి కొత్త అంశములు ఏవీ వెల్లడి కాలేదు. ఆగ్నేయాసియా రక్షణ మండలి మొదలు గోవా స్వాతంత్ర్యోద్యమం వరకు ప్రధాన మంత్రి ఇంతవరకు చేస్తున్న ప్రకటనాంశములనే లోక్‌సభలో వైదేశిక వ్యవహారాలపై చర్చను ప్రారంభిస్తూ చేసిన ప్రసంగములలో వివరించారు. ప్రతిపక్షం వారున్నూ తమ విమర్శలలో కొత్త విషయాలను వెల్లడించలేదు. విదేశాంగ విధానంలోనూ, ఆ విధానాన్ని అమలు చేస్తున్న పద్ధతులలో మార్పు లేనంతకాలం ఎవరి ప్రసంగాలైనా ఒకే విధంగా వుండక తప్పదు.

అయితే, లోక్‌సభలో రెండురోజులు జరిగిన చర్చల వల్ల భారతప్రభుత్వ వైనా విధానం కొంతవరకు స్పష్టమైంది. ఆగ్నేయాసియా రక్షణ మండలిని భారతప్రభుత్వం ఎందుకు ప్రతికూలించిందో వెల్లడి అయినది. అన్ని దేశాలతో మంచిగా ఉండడమే భారత ప్రభుత్వవైదేశికవిధానలక్ష్యం. తగాదాలకు, సంఘర్షణలకు దూరంగా ఉంటూ, వాటి పరిష్కారానికి రాజీ ప్రతిపాదనలు చేస్తూ వుండడమే ఆ లక్ష్య సాధనకు భారతప్రభుత్వం అనుసరిస్తున్న కార్యక్రమం. కొరియా, ఇండో–చైనాల విషయంలో భారతప్రభుత్వం ఇదే విధానాన్ని, ఇదే కార్యక్రమాన్ని అనుసరించినది. ఈ రెండు దేశాల రాజకీయసమస్యలు పరిష్కారమై శాంతిఏర్పడకపోయినా యుద్ధవిరమణమాత్రం జరిగినది.

కాని అంతర్జాతీయ వ్యవహారాల్లో ఒకసమస్య పరిష్కారమయ్యేసరికి రెండు సమస్యలు ఉత్పన్నమౌతున్నవి. ప్రధాన మంత్రి నెహ్రూ ఉద్ఘాటించినట్లు సమస్యలు ఏర్పడకుండా చేయడం ప్రస్తుత పరిస్థితులలో ఎట్టి విధానాన్ని అనుసరించినా సాధ్యం కాదు. ప్రపంచ రాజ్యాలు రెండువర్గాలుగా ఏర్పడిపోయినవి. రెండువర్గాలు యుద్ధానికే సన్నద్ధమౌతున్నవి. ఇతరదేశాలలో జరిగే యుద్ధసన్నాహాలను ఆపిందగల శక్తి భారత దేశానికి లేదు. భారత దేశంకంటే బలిష్ఠమయిన దేశానికీ లేదు. ఈ పరిస్థితులలో శాంతి ఉద్యమాన్ని శక్తివంతం చేసి, ఆ ఉద్యమం ప్రపంచరాజ్యాలన్నింట్నీ ఆవహించేటట్లు చేయడంకంటే శాంతిని మనస్ఫూర్తిగా కాంక్షించు దేశాలు చేయగలిగినది మరొకటి లేదు. ఈవిషయాన్నే ప్రధానమంత్రి లోక్‌సభ చర్చకు సమాధానమిస్తూ దీర్ఘంగా వివరించారు.

గోవా స్వాతంత్ర్య సంఘాలు డయ్యూపై 'దాడి' జరుపుతున్న 'సత్యాగ్రహుల' పై భారత పోలీసులు లాఠీచార్జి జరిపేందుకు ప్రధాన మంత్రి తమ విచారాన్ని వెల్లడించారు. గోవా వ్యవహారంలో భారత ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాన్ని లోక్‌సభ సభ్యులు పలువురు తీవ్రంగా విమర్శించారు. బ్రిటిష్ ప్రభుత్వం ఒత్తిడికి లోబడి భారత ప్రభుత్వం 'తటస్థ' విధానాన్ని అనుసరించుచున్నదని కూడా కొందరు ఆరోపించారు. భారత ప్రభుత్వం గోవా విషయంలో స్వయంగా ఏవిధమైన ప్రత్యేక చర్యలనూ తీసుకోలేదు. పోర్చుగీసు స్థావరాల విషయంలోనూ ఫ్రెంచి స్థావరాల విషయంలో వలెనే, పోర్చుగీసు ప్రభుత్వ ప్రతినిధులతోనూ సంప్రతింపులను మాత్రమే భారత ప్రభుత్వం కొనసాగించగలదు. అట్టి సంప్రతింపులు ప్రారంభం కావడానికి, ఆసాంతం కొనసాగడానికి పోర్చుగీస్ అధికారులు అంగీకరించవలసి యుంటుంది. కనుక గోవావిషయంలో భారత ప్రభుత్వాన్ని విమర్శించడం సబబు కాదు. భారత ప్రభుత్వాన్ని నిందించి ప్రయోజనం లేదు.

ఆగ్నేయాసియా రక్షణ మండలి విషయంలో భారత ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం ఎంతవరకు ప్రయోజనకరంగా ఉండగలదో కాలమే నిర్ణయించవలసి యున్నది. ఆఫ్రికా, ఆసియా ప్రధానమంత్రులు యీ రక్షణమండలిపట్ల అనుసరించే విధానాన్నిబట్టి కూడా భారత ప్రభుత్వం వెనుకటి వైఖరిని పునరాలోచన చేయవలసిన పరిస్థితులు ఏర్పడవచ్చును. ఏమైనా భారతప్రభుత్వ తాటస్థ్యానికి భంగం రాకుండా చూచుకోవడం చాలా అవసరం.

## చంద్రనగర్ విలీనం
### భారత విదేశాంగ శాఖ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30: చంద్రనగర్ విలీనీకరణబిల్లును పార్లమెంటు ఆమోదించడంతో అక్టోబరు 2 నుంచి పశ్చిమ బెంగాల్‌లో చంద్రనగర్ అంతర్భాగం కాగలదని భారత విదేశాంగ శాఖ ప్రకటించింది.

చంద్రనగర్ పరిపాలన 1950 మే 2 న అప్పగించబడినది. చంద్రనగర్‌ను భారత దేశానికి దత్తంచేయడానికి వీలుగా ఫ్రెంచి, భారత ప్రభుత్వాలు 1951 మే 2 న ఒక ఒప్పందం వ్రాసుకున్నాయి.

ఇదివరలో వుద్యోగులకిచ్చిన వుద్యోగపు షరతులు హామీలు రక్షింపబడగలవని విదేశాంగశాఖ తమ ప్రకటనలో తెలిపింది.

పశ్చిమ బెంగాల్ ప్రభుత్వసమ్మతితో యీ ప్రకటన విడుదల చేయబడింది.

## శ్రీ సంజీవరెడ్డిగారి ఢిల్లీ ప్రయాణం

కర్నూలు, అక్టోబరు 1: ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి మంత్రుల సమావేశంలో పాల్గొనే నిమిత్తం ఈనెల 11-వ తేదీన ఢిల్లీ వెళ్తారు. 13-వ తేదీ జరగనున్న ఆ సమావేశంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక వివరాలు ప్రస్తుత కృషి చర్చింపబడతాయి.

# భారత ప్రభుత్వ విదేశాంగవిధానం
## లోక్‌సభ ఆమోదం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30: రెండు రోజుల చర్చ అనంతరం, లోక్‌సభ భారతప్రభుత్వ విదేశాంగ విధానానికి ఆమోదం తెలపడమేగాక, యూరంగం లో సాధిస్తున్న ఘనవిజయాలను కొనియాడింది. ఇలా యిదివరకు జరుగలేదు.

శాంతియుత సహజీవనం, పరస్పర ప్రాదేశిక మర్యాద, నెహ్రూ-చౌల సంయుక్త ప్రకటనలోని సూత్రాలు గౌరవించబడం గురించిన భావాలు ప్రధమంగా ఒక అధికార తీర్మానంలో ప్రస్తావించబడినవి.

భవిష్యత్తులో భారతదేశం ప్రపంచంలో నాల్గవ పెద్ద రాజ్యమని నెహ్రూ ప్రకటించేసరికి సభవారు సుదీర్ఘ హర్షధ్వనులు గావించారు.

"ఈనాడు రెండు పెద్దశక్తులైన అమెరికా, రష్యాలు చాలా బలమైనవిగా వాలు ఆక్రమించుకుని వున్నాయి. బ్రహ్మాండమైన బలంతో చైనా రంగంలో ప్రవేశిస్తున్నది. ఇక భవిష్యత్తులో యీలోగా అకస్మాత్తుగా ఏమీ జరక్కపోతే-భారతదేశం నాల్గవఅగ్రరాజ్యం కాగలదు" అని నెహ్రూ అన్నారు. కమ్యూనిజం, దానికి విరుద్ధంగా వాదోపవాదాలు చేస్తూ కూర్చో వద్దని సభ్యులకు శ్రీ నెహ్రూ సలహా యిచ్చారు.

భారత విదేశాంగ విధానాన్ని గూర్చి ప్రధాని నెహ్రూ ప్రతిపాదించిన తీర్మానంపై లోక్‌సభ నేడు తిరిగి చర్చ ప్రారంభించింది.

చైనాతో పట్ సంబంధాలు నెలకొల్పుతున్నందుకు శ్రీ పట్టి వారాయణసింహ హర్షం ప్రకటించారు. ఒక మంది పఠానను సైన్యంగా నిర్మించమని కరాచీలోని అమెరికన్ రాయబారి పాక్ ప్రభుత్వానికి సలహాయిచ్చారన్న వార్త నిజానిజాలు తెలుసుకోవాలని ఆయన ప్రభుత్వాన్ని కోరారు.

### కృపలానీ విమర్శ

కొన్ని అత్యంత ఘనవిజయాలను సాధిస్తున్నందుకు భారత విదేశాంగ విధానాన్ని శ్రీ కృపలానీ అభినందిస్తూ అంతరంగిక వ్యవహారాల్లో ఫలప్రదం కాలేకపోయామని అన్నారు.

కాశ్మీర్, పాకిస్తాన్, దక్షిణాఫ్రికా, సింహళంలతో మన వ్యవహారాల విషయంలో భారతదేశం అపజయం పొందినదని కృపలానీ విమర్శించారు. మన పరిపాదులవరకు పరకైనాను అడుగుపెట్టనివ్వడాన్ని నిరోధించలేకపోయినందుకు మనిలాఒప్పందం ఏర్పాటును నిరోధించలేకపోయినందుకు కృపలానీ తీవ్రంగా విమర్శించారు.

"గోవాలో భారతీయుల ప్రవేశాన్ని నిరోధించడానికి ఏదైనా పరాయి ప్రభుత్వమంటే ప్రధానికి గల భయమే కారణమా?" అని ప్రశ్నించారు. గోవలను నిస్సహాయస్థితిలో భారతప్రభుత్వం త్రోసివేసిందని యీ సంగతి ముందే తెలిస్తే వారీవుద్యమాన్ని తలపెట్టివుండేవారు కాదని కృపలానీ అన్నారు.

సింహళంలో జరుగుతున్న కష్టాలన్నీ సింహళప్రభుత్వంభారతీయులకు వ్యతిరేకంగా అర్థం తీసుకున్నదని శ్రీ ఆర్. వెంకట్రామన్ అన్నారు.

ఫ్రెంచి, పోర్చుగీసు ప్రభుత్వాల సార్వభౌమత్వాన్ని భారతభూభాగంపై ఎక్కడా తాము గుర్తించలేదని ప్రభుత్వం వెంటనే ఒక ప్రకటన చేయాలని రామసుభాగ సింగ్ కోరారు. కామన్వెల్తు స్నేహితులు, పాక్, యీ గోవా విషయంలో గందరగోళం కల్పించారని అన్నారు.

శ్రీ ఎ. కృష్ణస్వామి, కామత్‌లుగార్లు కూడా చర్చలో పాల్గొన్నారు.

కృపలానీ ఆరోపణలకు నెహ్రూ సమాధానమిస్తూ గోవన్లు పోర్చుగల్ పాలనక్రింద ఎంతో కాలంగావున్నారని జరిగే ప్రచారాన్ని నిరోధించడానికి, విరుద్ధంగా వుండడానికిమాత్రమే భారతీయులను వుద్యమంలో పాల్గొనరాదని నిషేధించామని చెప్పారు.

"గోవా భారతదేశంలో భాగమే ఎవరు ఏ తీర్మానం చేసినా, ఏమి జరిగినా యీ మహాసూత్రాన్ని విడనాడ జాలదు. దీన్ని సాధించడానికి జరిగే కృషినీ వదులుకోము" అని నెహ్రూ చెప్పారు.

## సింహళ రాజ్యాంగ సవరణ
### అధికారభాషగా తమిళం పరిగణన

కొలంబో, సెప్టెంబరు 30: సింహళ, తమిళ భాషలు రెండూ కూడా సమాన హోదాగల అధికారభాషలుగా గుర్తించుటకు వీలుగా సింహళ రాజ్యాంగం త్వరలో సవరించబడుతుందని సింహళ ప్రధాని సర్ జాన్ కొటెలవాలా నేడు తన గౌరవార్థం జాఫ్నాలో జరిగిన ఒకవిందు సందర్భంలో ప్రసంగిస్తూ చెప్పారు.

### కొలంబోకు దేశాయ్ రాక

భారత హైకమీషనరు శ్రీ సి. సి. దేశాయ్ మద్రాసునుంచి నేడు కొలంబో తిరిగివచ్చారు.

## డిబ్రూగర్‌కు తిరిగి వరద ప్రమాదం

డిబ్రుగర్, సెప్టెంబరు 30: ఇటీవల 15 రోజుల క్రితమే బ్రహ్మపుత్రా వరదలమూలంగా కకోరపరీక్షకు గురియైన డిబ్రుగర్‌లో తిరిగి వరదనీరు ప్రవేశించింది. అనేక తేయాకు తోటలలో చాలా లోతుగా నీరు నిలిచింది. బ్రహ్మపుత్ర తోపాటు దాని వుపనదులుకూడా బాగా పొంగాయి.

### తపతీనది పొంగు

సూరత్, సెప్టెంబరు 30: తపతీనది గట్టుమీదనుంచి ఎగప్రాకిన కారణంగా గతరాత్రి ఇచటకు మూడు మైళ్లలో వున్న రెండు గ్రామాలు మునిగిపోయాయి. అనేకమంది నిరాశ్రయులైనారు. 50 శవాలను కొట్టుకుపోతుండగా చూశామని ఒక ప్రత్యక్షసాక్షి చెప్పాడు.

### తగ్గుముఖం

తపతీనది వరదలు కొంత తగ్గుముఖం పట్టాయి. 4½ అడుగులనీరు తీసింది. రంధేర్ పట్టణంతో టెలిఫోన్ ద్వారా మాత్రమే సంబంధం వున్నది. బొంబాయి అహమ్మదాబాదు ట్రంక్ రోడ్డుపై 8 అడుగులనీరు నిలిచివుంది. నీటిలో మునిగిపోయిన భాటా, భట్, పూరుగ్రామాల జనాభ ఏమైపోయిందీ యింతవరకు తెలియలేదు. ఇంకో 6 అడుగుల నీరు తీస్తేగాని రంధేర్‌తో రోడ్డు రవాణా జరగదు. సూరత్‌కు పరిసర గ్రామాలనుంచి కూరలు, పాలు అందలేదు. ఫలితంగా ధరలు అంతులేకుండా పెంచారు.

ముల్తాన్ జిల్లాలో జననష్టం విశేషంగా కలిగింది. కొన్ని ప్రాంతాల్లో 7 అడుగులనీరు నిలిచింది. అనేక గ్రామాలు మునిగిపోయాయి.

పాకిస్తాన్ దేశీయ వ్యవహారాల మంత్రి గుర్మానీ, రక్షణమంత్రి ఖాన్ లియాఖత వరదప్రాంతాలు పర్యటించారు. లాహోర్‌లో విపరీత వర్షాల మూలంగా 650 ఇళ్లు 2000 పూరిళ్లు కూలిపోయాయి. రెడ్‌క్రాస్‌కు చెందిన రు 4 లక్షల విలువగల మందు సామగ్రి చెడిపోయింది.

గుజ్రన్‌వాలా, పఠాన్‌కోట, షేక్‌పురా ప్రాంతాలలో జన ఆస్తి నష్టం కలిగినట్లు వార్తలు వస్తున్నవి.

## జలపాయగురి సమీపంలో వరదలు

సిలిగురి, సెప్టెంబరు 30: పశ్చిమ బెంగాల్‌లోని దూవర్స్ జిల్లాలో అనేక నదులు విపరీతవర్షాల మూలంగా పొంగి జలపాయగురి ప్రాంతంలో రాకపోకలకు అవరోధం కలిగించాయి. సిలిగురినుంచి పైకి రాకపోకలు రైలుమార్గంలో నిలిచిపోయాయి. చాలా వంతెనలు కూలిపోయాయి.

## నాలుగు బిల్లులకు రాజ్యసభ ఆమోదం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 29: లోక్‌సభ ఆమోదించిన 4 బిల్లులను నేడు రాజ్యసభ వెంటవెంటనే ఆమోదించింది. ఆవిటారిఫ్‌బిల్లు (ద్వితీయ సవరణ) పన్నులచట్టాల బిల్లు, (జమ్మూ కాశ్మీరుకు వర్తింపు) కౌందీశీకుల ఆస్తిపాస్తుల నిర్వహణబిల్లు (సవరణ బిల్లు) ఆదాయంపై మధ్యభారత్‌లో పన్నులవిధింపు బిల్లు.

కౌందీశీకుల ఆస్తులకు సంబంధించిన బిల్లుపై చర్చకు శ్రీ ఎ పి జైన్ సమాధానమిస్తూ పరిహారం మొత్తం ఇచట నివసిస్తున్న ముస్లింలను త్రోసిపుచ్చి ఎక్కువ చేయరాదని చెప్పారు. చట్టంలోగల ఉద్దేశ్యం అదికాదన్నారు. "కౌందీశీకులకుగల హక్కులవలెనే, ముస్లిములకుకూడా స్వంతహక్కులు కొన్ని వున్నవి. వెంటింటతమ్ముడ్ని ఘర్షణ కూడదు" అని వివరించారు.

## పశ్చిమ పాకిస్తాన్‌లో వరదలు

లాహోర్, సెప్టెంబరు 30: చీనాబ్, రావి, సట్లెజ్ నదులు పొంగి పశ్చిమ పంజాబ్‌లోని మూడు జిల్లాలను ముంచెత్తాయి. 300 మైళ్ళ ప్రాంతమంతా బ్రహ్మాండమైన సరస్సుల మాదిరిగా మారిపోయింది. పంటలు ధ్వంసమైనాయి. పశు, జననష్టం కలిగింది. 5 వేల ఇళ్లు కూలిపోవడమో కొట్టుకుపోవడమో జరిగింది. గుజరాత్ ప్రాంతంలో 7 గురు చనిపోయారు. 19 మంది కన్పించడంలేదు. అనేక గ్రామాలకు ఇతరుల ప్రపంచంతో సంబంధాలు తెగిపోయాయి.

మాధీలో 14 అంగుళాల వర్షం కురిసింది. సూరత్‌కు చేరుతున్న వార్తలబట్టి కోతకు సిద్ధంగావున్న ఆహార పంటలు విపరీతంగాదెబ్బతిన్నవని తెలుస్తున్నది. సూరత్ జిల్లా రైతునాయకులు వరదప్రాంతాలు పర్యటిస్తున్నారు.

## బ్రోచ్‌లో ఇల్లుకూలి ముగ్గురి మరణం

అహమ్మదాబాదు, అక్టోబరు 1: అధికవర్షాలమూలంగా బ్రోచ్‌లో 33 ఇళ్లు కూలిపోయాయి. ఒకఇల్లు కూలి ముగ్గురు మరణించారు.

# 'భారతదేశం నాల్గో అగ్రరాజ్యం'
# చైనా భారతదేశాలు ప్రపంచశ్రేణిలో రెండు బ్రహ్మాండమైన రాజ్యాలని నెహ్రూ
## విదేశ వ్యవహారాలపై లోక్‌సభలో చర్చకు సమాధానం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30: పార్లమెంటులో, విదేశాంగ నీతినిగూర్చి జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ ప్రధాని నెహ్రూ ప్రపంచంలో అగ్రరాజ్య నిర్మాణం, కామన్‌వెల్తులో భారత దేశం ఉనికి, సింహళంలో భారతీయుల సమస్య, భారత దేశం బర్మా-ఇండోనీషియాల సన్నిహితత్వం, భారత దేశ భవిష్యత్తు మొదలైన అనేక అంశాలను గూర్చి ప్రసంగించారు.

జాత్యహంకార విధానాలకు వలస రాజ్యాధికారిత్వాలను ఖండిస్తూ, అంతర్జాతీయ బుద్ధిమత్వాన్ని సమర్థించారు.

ఈ సందర్భంలో ప్రధాన మంత్రి ప్రపంచపరిస్థితులనుసింహావలోకనం చేస్తూ, ఈ లోకంలో రెండేరెండు బ్రహ్మాండమైన రాజ్యాలు ఇప్పుడు వున్నాయి, అవి రష్యా అమెరికాలు. ఇంకో రెండు రాజ్యాలు బ్రహ్మాండమైనరాజ్యాలుగా అవతరించబోతున్నాయి అవి చైనా,భారతదేశాలు," అన్నారు.

ఈ నాల్గురాజ్యాలలోను భారతదేశం నాల్గో అగ్రరాజ్యం అన్నారు.

భవిష్యత్తుమీద దృష్టిలెగించండి, వర్తమానాన్ని దానికి అడ్డురానీయకండి, ఇండియా, చైనాలవంటి దేశాలభవిష్యత్తు బ్రహ్మాండమైంది. ఇట్టి దేశాలలో వైదేశికుల పెత్తందారీతనం, అంతరంగికమైన ఐకలుకలు తొలగిపోతే, అవి విధిగా బ్రహ్మాండమైన రాజ్యాలుగా రూపొందుతాయి. వాటిని ఎవ్వరూ ఆపలేరు అన్నారు.

ఈ విషయాన్ని తాను స్వంత గొప్పకోసం చెప్పడంలేదని, వున్న పరిస్థితిని వున్నట్లు మాత్రమే రూపిస్తున్నానని ప్రధానమంత్రి స్పష్టంచేశారు. ఆర్థికాభివృద్ధి, ఐకమత్యం, అన్నీకుదిరి, యుద్ధాలు, గిద్దాలు రాకుండావుంటే, ఈ దేశాల ప్రజల కృషి శక్తి, సామర్థ్యం, వీటివల్లనే ఇవి తమ అగ్రస్థానాన్ని ఆక్రమించుకో గల్గుతాయి. వీటికివే మౌలికంగా ఈ రెండుదేశాల ఉనికే గూడా అందుకు తగినట్లువుంది అని ఆయన వివరించారు.

ప్రపంచంలో బ్రహ్మాండమైన చారిత్రక పరివర్తనం ప్రాదుర్భావం పొందిందని, దాన్ని గుర్తించక కమ్యూనిజం అని, కమ్యూనిజం వ్యతిరేకత అని ఆధ్యాత్మికపాప వాదాలలో తలలు దించుకు కూర్చోవడం అయోగ్యం అని, కొన్ని వందల సంవత్సరాలు నొక్కివేయబడిన బృహద్దేశాలు తిరిగి తలలు ఎటాఎత్తుతున్నాయో గమనించకపోవడం పశ్చిమ రాజ్యాలకు ఒక లక్షణంగా తయారైందని ఆయన వివరించారు. ఈ పశ్చిమ రాజ్యాల మనస్సులు కమ్యూనిజం, కమ్యూనిజం వ్యతిరేకతలనే ఆధ్యాత్మిక పాపవాదాలచేత ఆచ్ఛాదితాలయిపోవడంవల్ల, వారి ప్రపంచంలో తలెత్తుతున్న ఇతరశక్తులను చూడకపోతున్నాయి. అనియాకు ఈపిచ్చి పట్టదు. మనకు కమ్యూనిజంఅంటే ఇష్టం వుండవచ్చు; వుండకపోవచ్చు; అదే మనకు ప్రధానం కాదు. మనం ఇతర విషయాలను గూర్చిగూడా ఆలోచిస్తాం. మనల్ని గురించి ఆలోచించుకుంటాం; మనచుట్టూవున్న సంగతులను గూర్చి విచారణచేస్తాం; మనం ఎట్లా పైకి వస్తామూఅని ఆలోచనలు చేస్తాం అన్నారు.

ఈసందర్భంలో నెహ్రూ కామన్‌వెల్తులో ఇండియా ఉనికిని గట్టిగా సమర్థించారు. ఈవిషయాన్ని పట్టి అభినివేశాలు పెట్టుకొని పరిశీలించడం తగదని, ఇందువల్ల మనకు, ప్రపంచానికి మనం అనుసరిస్తున్న,అంతర్జాతీయవిధానాలకు దోహదం లభిస్తున్నదో, లేదో విచారించి, పరీక్షించాలని, అది ఒక్కటే సరియైనపరీక్షఅని అన్నారు. తన వాదాన్ని బలపరుచుకోడానికి ఆయన ఈ అంశాలను ఉటంకించారు. (1) కామన్‌వెల్తులో నాల్గు అయిదు సంవత్సరాలుగా వుంటున్నాం; అందువల్ల మన స్వాతంత్ర్యం ఏవిధంగానూ కుంటుపడలేదు. (2) ఈ సంబంధం వల్ల ఇందులోని ఏ దేశంపట్లగాని మన విధానాలను మార్చుకోవలసిన అవసరం కల్గలేదు (3) ఈ సంబంధం మనకు ఏవిధంగాను అడ్డురాలేదు సరిగదా, సైగా సహాయకారి అయింది (4) మలయా, ఫీజీ, మారిషస్, ఆదిగాగల దేశాలలో భారతీయులైనవారు బహుసంఖ్యాకులు నివసిస్తున్నారు. కామన్‌వెల్తులో మనం వుండటంవల్ల, అచ్చట ఈ భారతీయుల స్థితిగతులు క్షేమంగా వుండటానికి అవకాశం ఏర్పడింది (5) కామన్‌వెల్తులో మన ఉనికివల్ల ప్రపంచ శాంతికి దోహదం లభిస్తున్నది. ఈ విషయాన్ని చైనా ప్రధాని చౌఎన్‌లై స్వయంగా అంగీకరించారు. కామన్‌వెల్తులో వుండడానికి నిశ్చయించుకొని ఇండియా తెలివిగల పనిచేసింది. ఇందువల్ల ప్రపంచశాంతికి లాభం చేకూరుతున్నది అని ఆయన అన్నారు.

సింహళం భారతీయుల సమస్యను గురించి మాట్లాడుతూ, ఆర్థిక ఆంక్షలు ఆదిగాగల పనికిమాలిన సూచనలను ప్రధానమంత్రి తిరస్కరించారు. ఇండియా గొప్పదేశం; గొప్ప భవిష్యత్తు వుంది. ఈ విషయాన్ని గమనించాలి. వర్తమానంలో తలలను దించుకొని, పనికిమాలిన పనులు చేయడం అయోగ్యం; పాకిస్తాన్ అనండి, సింహళం అనండి, మరోదేశం అనండి, దేనిపట్లనైనా ఇట్టి ఆంక్షల పద్ధతిని అనుసరించడం గొప్పతనం లక్షణం కాదు. అదీకాక, ఇందులో ఇంకో విశేషంవుంది. భారతీయులు సింహళంలో చేరి, దాన్ని ముంచెత్తి, తుదకు దేశిపేసి కుంటారన్న పిచ్చి భయంతో సింహళీయులు వ్యవహరిస్తున్నారు. ఆగ్నేయ ఆసియాలో కొన్ని కొన్ని దేశాలు తమ హద్దుల్లో వున్న చైనా వారిజనాభాను చూచి ఇట్లాగే భయపడుతున్నాయి. "ఈ మన రెండు దేశాలు, పెద్ద దేశాలు. ఈ దేశాల జనాభా ఆ దేశాల్లోకి ఎక్కిందంటే. దాన్ని చూచి వారు భయపడుతున్నారు. ఈ భయాన్ని మనం పారద్రోలాలి" అని నేను చైనా ప్రధానితో అనగా ఆయన "ఈ మాట నిజమే" అని అంగీకరించారు. అట్లాగే సింహళం ఈ భారతీయులనుచూచి పడు భయాన్ని మనం పారద్రోలాలి. సింహళాన్ని కబళించాలన్న ఆశ ఇక్కడ ఎవ్వరికీ లేదు. అది స్వతంత్రంగా వుండాలని, స్నేహంగా వుండాలని మనం వాంఛిస్తున్నాం. మన పరిసరాల్లోని అవలవున్న దేశాలతో సాంస్కృతికంగానూ, చారిత్రకంగానూ, భాషా విషయకంగానూ, మత విషయకంగానూ సింహళం కన్నా మనకు దగ్గరగావున్న దేశం ఇంకొకటి లేదు అన్నారు.

ఇండియా–బర్మా–ఇండోనీషియాల మధ్య పెరుగుతున్న చారిత్రాత్మకమైన సన్నిహితత్వాన్నిగూర్చి నెహ్రూ ఈ సందర్భంలో ప్రసంగించారు. ఆగ్నేయ ఆసియా దేశాల్లో మనతో ఇంత సన్నిహితంగా వుంటున్న దేశాలు వేరే లేవు. ఈ ఆగ్నేయ ఆసియాలో చిన్న దేశాలేమి, ఇంకా ఇతరత్రావున్న దేశాలేమి, ఎన్నో మనతో కలిసి పనిచేస్తున్నాయి. కాని ఈమూడు దేశాల కలిసికట్టుతనం బ్రహ్మాండంగా వుంది. ఇది మంచికే వచ్చింది. సింహళమూ, పాకిస్తానుగూడా ఇట్లావుంటేఇంకా ఎంతో బాగుంటుంది అన్నారు. జపానుతో మన సంబంధాలుగూడా చాలా బాగా వున్నాయని అన్నారు.

ఈప్రపంచంలో ఏకత్రింగావుంటామంటే అది సాగే విషయం కాదని గూడా ఆయన స్పష్టం చేశారు. ఆచార్య నరేంద్ర దేవ్ శ్రీ అశోక మెహతాలు వ్రాసిన ఉత్తరంలోని అంశాలతో ఏకీభవిస్తూ ఆసియా ఆసియా వాసులకే అన్నవాదం విపరీతస్థితిపడటం తగదని అయితే ఆసియా రాజ్యాల వ్యవహారాలలో మాత్రం ఒకరి ప్రమేయాన్ని మాత్రం ఎన్నడు సహించరాదని, ఆదేశాలను వాటి తీరునిబట్టి ప్రతిభనుబట్టి పెరగనియ్యడం యోగ్యం అని వివరణ చేశారు.

దక్షిణ ఆఫ్రికా అనుసరిస్తున్న జాత్యహంకారసిద్ధాంతాలను ఖండిస్తూ ఐరోపాలోవారు, అమెరికాలోవారు, దీన్ని అంతగాపట్టి పంచుకోకపోవడం తమకు ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నదని, ఇంతవరకు పని చేతి పరిష్కరింపబడలేకుండా ఈదుష్ట తత్వం భారతీయులకు కమ్యూనిజం, కమ్యూనిజం వ్యతిరేకతలకన్నా ముఖ్యమైనదని స్పష్టంచేశారు.

తన్ను కమ్యూనిస్టుల పొడుకూరిపదుడని, సహాయాత్రికుడని హిందూ మహాసభ సభ్యుడు శ్రీ చటర్జీ చేసిన విమర్శను ప్రధానమంత్రి పరిహసిస్తూ త్రోసిపేశారు. నేను ఒక్క కమ్యూనిజంకే కాదు, చాలావాటికే, చాలామందికి సహయాత్రికుడ్నే, అందులో చాలా, వారిలో ఆపేకుల శ్రీ చటర్జీ ఇక్కడికి రాకపోవచ్చు. నేను చాలాదేశాలు తిరిగాను. చాలా సిద్ధాంతాలనుపట్టి చూచాను. ఎంతోమందికి అను యాత్రికుడ్నై మసలాను. విశదమైన మనస్సుతో ఒక్క కమ్యూనిజం నేకాదు, ఏదకమైన సిద్ధాంతమైనా మేము పట్టిచూస్తాం. దానితో ఏకీభవిస్తున్నామా, లేదా అన్నది వేరే ప్రశ్న. వాటిని ముట్టుకోకూడదనేనా మాత్రం మేము ఎన్న

## రాజధానిలో రాష్ట్ర జన్మదినోత్సవం

(1 వ పేజీ తరువాయి)

నిండివుంటాయి. ఆంధ్ర రాష్ట్రం యేర్పడినందువల్ల అన్నింటికంటె ఎక్కువ లాభం పొందినది కర్నూలే. వసతులు పట్టణజనాభా పెరిగింది. రోడ్లు తారురోడ్లుగా మారి బాగుపడ్డాయి. ప్రజారోగ్యం, పారిశుద్ధ్యం అభివృద్ధి అయినవి. కర్నూలు సమాజసేవా సంస్థలు, పని ప్రారంభించి కలిసి కట్టుగా వ్యవహరించడానికి పూనుకొంటున్నవి. ఈ పట్టణంలో ఉటిపడే నవజీవన స్ఫూర్తి న్యాస్కే, ఆంధ్రదేశమంతటా మనం చూడగలుగుతాం.

ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాలలో నేను పర్యటిస్తున్నాను దాదాపు అన్ని జిల్లాలను చూచాను. ఆంధ్రలో ప్రతిచోటా ప్రజల స్థైర్యం ఉత్సాహం, అభ్యుదయ కాంక్ష, నాకు స్పష్టంగా కన్పించింది. రాష్ట్రంలో యెంత పని జరుగుతున్నదీ గూడా చూచాను. విజయానికి ప్రాతిపదిక కృషియేగదా! నేను నిర్మొగమాటంగా మాట్లాడే మనిషినని మీకందరికీ తెలుసు. అనవసరంగా ఎవరిని పొగడను. ఎంత మటుకు లోపాలను, పొరపాట్లను ఎత్తి చూపడమే నాఅలవాటు. కాని శభాశ్ పొగడుతున్నానంటే, ఆ పొగడ్తకు మన ప్రభుత్వము, ప్రజలు అర్హులన్నమాట. నేను యిది గట్టి నమ్మకంతో చెబుతున్నాను. మనం ఎదుర్కోవలసి వచ్చిన యిబ్బందులు, అనుభవించాల్సి వచ్చిన కష్టాలు ఇవన్నీ చూచినట్లయితే ఆంధ్ర ప్రభుత్వము, ప్రజలు ప్రశంసనీయమైన పని చాలా సాధించారని చెప్పవచ్చు. ఉదాహరణకు ఇరిగేషన్ విద్యుచ్ఛక్తి, విద్య, మొదలైన రంగాలలోనూ, కమ్యూనిటీ ప్రాజెక్టుల క్రింద, జాతీయవికాస విస్తరణ శాఖల క్రింద గల గ్రామాలలో గ్రామాభివృద్ధి కార్యకలాపాలలోనూ, ఆంధ్ర ప్రభుత్వం సాధించినది చెప్పుకోదగ్గది. అయితే ఆత్మసంతృప్తితో ఉండే స్థాయిలో ఉండవీలులేదు. మనం మనపనిని చక్కగానే ప్రారంభించాము. రాష్ట్రమంతటా ఆర్థిక పరిస్థితులను అభివృద్ధిచేసి ప్రజలజీవన ప్రమాణాన్ని క్రమంగా పెంపొందించాలని మనం తలపెట్టిన పని చాలా జటిలమైనట్టిది.

ప్రథమద్వితీయ పంచవర్ష ప్రణాళికల లక్ష్యం యిదే. ప్రథమ పంచవర్ష ప్రణాళిక, ప్రజల ఆర్థికాభివృద్ధి అనే దానికి పునాదినిర్మించింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆ సౌధాన్ని నిర్మిస్తుంది. అకుంఠిత దీక్ష, పరస్పరసహనము అన్యోన్య భావ్యావసహకారము, నిర్విరామకృషి అవసరం. ఆంధ్రదేశంలో సుఖసౌభాగ్యాల అభివృద్ధి, ప్రతిఒక్కరు యథాశక్తి కృషిచేయగలరని సామూహికం మీరందరూ సమైక్యంగా, మనస్ఫూర్తిగా కృషిచేసినట్లయితే, చీకటిగడచి వెలుగువచ్చినట్లే. మహత్తరమైన విజయం పొందగలుగుతారు. ఇది నేనేం జోస్యం చెప్పడం లేదు. కష్టపడిచేస్తే ఆకష్టం వృథా కాదు.

అని గవర్నరు తన ప్రసంగం ముగించారు.

విన్యాసంలో పాల్గొన్న పోలీసులు మూడుసార్లు తుపాకులు కాల్చారు. ఆ తర్వాత విన్యాసం, గవర్నరు వందన స్వీకారం జరిగినవి.

సుబేదార్ యం మున్నైర్ నాయకత్వాన ప్రత్యేక సాయుధ పోలీసు దళం, సార్జెంట్ ఆర్. సుబ్రహ్మణ్యం నాయకత్వాన కర్నూలు తాలూకా పోలీసు దళం విన్యాసంలో పాల్గొన్నవి. ఈ విన్యాసదళాలన్నింటికి ఎస్. ఎ. పి. కమాండెంట్ మేజర్ కె ఆర్. రెడ్డి నాయకత్వం వహించారు. విశాఖపట్నం ప్రత్యేక సాయుధ పోలీసు బ్యాండు యీ విన్యాస సందర్భంలో పాల్గొన్నది.

దూ భయపడం, అవి ఈ భూవిలో, భారతభూమిలో ప్రవేశ్లు దిగివున్నావా, లేదా అని విచారిస్తాం. ఇండియా స్థితిగతులకు ఇది సరిపడతదో, పడదో పరిశీలిస్తాం. మా ఆశయాలకు, లక్ష్యాలకు సరిపోతాయేమో పరీక్షచేస్తాం, కాని వాటిని సాధించడానికి అవార్యమైన పద్ధతులను, హింసామై. ఈ పాదాలను అనుసరిస్తే, వాటిని మేము తిరస్కరిస్తాం అని ఆయన సమాధానం చెప్పారు.

## బందరులో ఆంధ్ర వార్షికోత్సవం

మచిలీపట్టణం, అక్టోబరు 1: ఆంధ్ర రాష్ట్రఅవతరణ మహోత్సవ ప్రథమ వార్షికోత్సవం సందర్భంగా రాబర్టుసన్ స్క్వేర్ మార్కెటు ప్రాంతం జెండాలతో, తోరణాలతో అలంకరించబడింది. ఈఉత్సవ కార్యక్రమాలు మున్సిపల్ బ్రాడ్ కాస్టింగ్ స్టేషన్ ద్వారా గురజాడ రాఘవశర్మగారు జాతీయగీతాల ఆలాపనతో ప్రారంభమైనాయి. ప్రభుత్వ భవనాలు, స్థానిక సంస్థల భవనాలు, వాణిజ్య, ప్రయివేటు భవనాలమీద జెండాలను ఎగురవేశారు.

జిల్లా కలెక్టర్ ఎస్ అబ్దుల్ ఖాదర్ పోలీసు పెరేడ్ గ్రౌండ్సులో ఉదయం జిల్లాసాయుధ రిజర్వువారి గౌరవవందనాన్ని స్వీకరించారు పట్టణ కాంగ్రెసు సంఘ కార్యక్రమాలలో జెండాప్రతిష్ఠ, ఇంగ్లీషు పాలెంలో బీదప్రజలకు అన్నదానం, ప్రాథమిక పాఠశాల పిల్లల ఊరేగింపు, మున్సిపల్ పార్కులో బహిరంగసభ ఉన్నవి.

శ్రీరామ లింగేశ్వరస్వామి దేవాలయంవద్ద సభజరిపి కమ్యూనిస్టులు కూడా ఉత్సవం జరిపారు. (స్వ వి)

## మద్రాసులో ఆంధ్ర రాష్ట్ర ఉత్సవం

(1 వ పేజీ తరువాయి)

లయము ఆవరణయందు నేటి ఉదయంజరిగిన ఆంధ్రరాష్ట్ర ప్రథమ వార్షికోత్సవసభకు అధ్యక్షతవహించిన శ్రీకొండ వెంకటరామ మూర్తి గారు ఉద్బోధించారు.

ఈ సభకు ప్రస్తుతం మదరాసులో వున్న ఆంధ్ర ప్రభుత్వపు అన్ని కార్యాలయాల ముఖ్య ఉద్యోగులున్నూ ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారును విచ్చేశారు.

ఆంధ్రమాత ప్రార్థనతో సభ సరిగా ఉదయం 8-30 గంటలకు ప్రారంభింపబడినది. ఆంధ్ర రివిన్యూబోర్డు కార్యదర్శి శ్రీ కాసుమిల్లి సుబ్బారావుగారు శ్రీ రామమూర్తిగారికి సభాసదులకు స్వాగతము పలుకుచూ యిట్లు చెప్పారు. ఈ రోజు చాలా సుదినము. సుమారు 40 సంవత్సరాలకు పైగానుండే ప్రతి ఆంధ్రుడు కోరిన కోర్కెలు సంవత్సరం క్రిందట సఫలీకృతమైనది. రాష్ట్రపు ప్రథమ పుట్టినరోజు మన కందరకూ చాలా సంతోషకరమైయున్నది. ఇట్టి పవిత్రమైన దినమున ఆంధ్రరాష్ట్ర సేవకులైన మనము నడుము కట్టుకొని శక్తి వంచన లేకుండా ఆంధ్ర ప్రభుత్వసేవ చేయటానికి కృతనిశ్చయులము కావాలి. ఈ సందర్భమున యిక్కడికి వచ్చి మన కందరికీ ఈ సందేశము వినిపించటానికి అంగీకరించిన శ్రీ కొండ రామమూర్తిగారు సభకు అధ్యక్షత వహించవలసిందిగా కోరుతున్నాను. అని సుబ్బారావుగారు చెప్పారు.

అధ్యక్షులు శ్రీ కొండ రామమూర్తిగారు ప్రసంగిస్తూ యిట్లా చెప్పారు. ఈ రోజున మీరు నన్ను అధ్యక్షునిగా ఎంచుకొన్నందుకు మీకు చాలా వందనములు. 40 యేండ్ల క్రితం శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, శ్రీ కొండా వెంకటప్పయ్య శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య, శ్రీ ప్రకాశం పంతులు మొదలైన ప్రముఖ నాయకులు కలలు కని వాంఛించిన ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం యిప్పటికి సఫలీకృతమై మనము అనుభవిస్తున్నాము. కలలు కనడం ఆంధ్రుల సైజ గుణమే అయి యున్నది. ప్రతి ఆంధ్రుడూ కలకన్న యీ ఆంధ్రరాష్ట్ర శిశువు పొట్టి శ్రీరాములు బలిదానమనే కడవటి ప్రసవవేదనతో కర్నూలులో జననమైనది. రాష్ట్ర అవతరణ సమయమున లక్షలమంది ఆంధ్రులు సంతోషంతో పాల్గొన్నారు. ఆంధ్రరాష్ట్రం అనే శిశువును మన మందరమూ పోషిస్తున్నాము. శిశువు ఆరోగ్యంగా ఉండి అడుకొంటూ ఉంటే తల్లిదండ్రులకేగాక వారి పరివారముకూడా యేరీతిగా సంతోషిస్తారో అదేప్రకారం ఆంధ్రరాష్ట్ర శిశువు కళకళలాడుతుంటే రాష్ట్ర సేవకులైన మనకందరికీ సంతోషప్రదం కాగలదు. ఆంధ్రరాష్ట్ర శిశువును పోషించడం ప్రభుత్వోద్యోగుల ధర్మము మాక్కూడాఅయియున్నది. మనం బండిలో కూర్చొనియున్నాము. బండి ఎక్కడికిపోతుందో తెలియదు. కర్నూలులోగాని గుంటూరులోగాని మరేచోటగాని కష్టాలున్నా మన కుతూహలంమాత్రం తగ్గలేదు. ఆంధ్రులకలలు కవనంలో చాలా వుత్తేజ్జలు. మేఘాలులేక వానలురావు. అదేప్రకారం మన ఆశయాలుకూడా ముందు కలలరూపంలో ఉండి తరువాత వాటి కార్యాచరణతో మనం కలలను సాధించుకోడానికి వీలౌతుంది. మనం ప్రత్యేకరాష్ట్రమునే పెద్దకలనుకని సాధించుకొన్నాము. భాషారాష్ట్రాల మార్గమైన ఇతరులుకూడా ఈకలలు కంటున్నారు. ఆంధ్రులైన మనము యింకా కొన్ని కలలు కంటూనేయున్నాము. వాటిలో ముఖ్యమైనవి గోదావరి,కృష్ణ నదుల కలలు. ఆనదులు మనదేశమును సస్యశ్యామలంగా చేయగలవి. గోదావరి కలకు వామరూపం ఏర్పడింది. కాని ఇంకా ఆదిసిద్ధించలేదు. అదేప్రకారం, కృష్ణానది కలకు ఒక స్వరూపం ఏర్పడవలసి యున్నది. మనము ఆంధ్ర రాష్ట్రమును సుసంపన్నము చేయాలంటే ఒకశక్తితో పాటు భూశక్తిని కూడా సక్రమ పద్ధతులలో వినియోగించుకోవాలి.

# అరాచకశక్తుల నెదుర్కొనుటకు యువజనం నడుంకట్టాలి

## మంత్రి తిమ్మారెడ్డిగారి హెచ్చరిక: పశ్చిమ గోదావరి యువజనకాంగ్రెసుసభలో ప్రసంగం

ఏలూరు, సెప్టెంబరు 28 "ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుల పలుకుబడి పడిపోతోంది అని అనుకునేవారు పొరబడుతున్నారు. పైకి ఉధృతంగా లేకపోయినా, అది నివురుగప్పిన నిప్పులా, అన్నివర్గాల్లోనూ వ్యాపిస్తోంది ఈ అరాచకశక్తులను ఎదుర్కొని రూపుమాపవలసిన బాధ్యత ఆంధ్ర యువజనులమీద ఉన్నది. భారతదేశంలో అరాచకశక్తుల విజృంభణకు ఆంధ్రదేశంలో నాందిఅయిందనే అపఖ్యాతి మనకురాకుండా ఆంధ్ర యువజనలోకం నడుంకట్టాలి" అని మొన్న ఉదయం యిక్కడ జరిగిన ప. గోదావరి జిల్లా యువజన కాంగ్రెస్ మహాసభను ప్రారంభిస్తూ ఆంధ్ర వ్యవసాయశాఖామంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డిగారన్నారు. సభకు ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు సమావేశానికి శ్రీ పి. పోచిమూర్తిరాజు, డా॥ ము రంగయ్య, డు. రాజశేఖరరావు, అడ్డేపల్లి సత్యనారాయణ, కిర్లంపూడి బ్రహ్మయ్య, గుడిమెట్ల గంగరాజు, మొదలయినవారు హాజరయినారు.

శ్రీమతి సి. అమ్మన్న రాజాగారు, సభాప్రారంభంలో జాతీయపతాకావిష్కరణం చేశారు

శ్రీ సత్యనారాయణగారు ప్రతి సంవత్సరం ఏలూరులో రాష్ట్రయువజన కాంగ్రెసుసభలు జరిగేవనీ ఈసంవత్సరం అవి గుంటూరులో జరపడానికి నిశ్చయింపబడినందువల్ల జిల్లాసభలు జరపడానికి ఏర్పాటు చేయబడిందంటూ యిదివరలో యువజన కాంగ్రెసుకు అధికంగా సేవచేసి, దాని అభివృద్ధికి కారకులైన శ్రీ తిమ్మారెడ్డిగారు ఈ రోజు సభాప్రారంభకులుగా రావడం ముదావహమైంది అన్నారు.

శ్రీ తిమ్మారెడ్డిగారు సభను ప్రారంభిస్తూ "దేశసేవ, దీక్ష మొదలైన యువకగుణాలన్నీ వృద్ధులను ఆవహించి, వృద్ధులు సేవచేస్తూనే ఉన్నారని, అలసత, జడత్వమూ మొదలైన వృద్ధుల గుణాలు మన యువకులను ఆవహించి యువకులు వెనుకపడి పోతున్నారనీ అన్నారు. సాధారణ జీవితంలో కుమారుడు యుక్తవయస్సు రాగానే తండ్రులు భారం వాళ్ళమీదవేసి, తాము తప్పుకుంటారు కాని మన రాజకీయరంగంలో వృద్ధులు అలా తప్పుకోవడంలేదు. చివరకు వారు అంతరిస్తేనే తప్ప యువకులకు పెత్తనం వచ్చేట్లు లేదు అన్నారు.

అహింసాయుతమైనయుద్ధంద్వారా బ్రిటిషువారిని తరిమివేశాం. ప్రస్తుతం అంతకన్నా ప్రమాదకరమైన అంతశ్శత్రువులను మనం ఎదుర్కొనవలసివుంది ఈ శత్రువులనుండి మన దేశానికి ముక్తి యిప్పించటం తేలికగాదు.

ఈ అరాచకశక్తులు ప్రతి చోటా వ్యాపిస్తున్నాయి. వీటి వ్యాప్తికిముఖ్య కారణం మన గ్రామాలలోని అనైక్యతయే. యిదివరకు ఎన్నికలలో కాంగ్రెసు దెబ్బతిన్నదికూడా యితర శక్తుల బలంవల్లకాక, కాంగ్రెసులోని అనైక్యతవల్లనే. కనుక ఈ అనైక్యతను నిర్మూలించడానికి యువకులుముందుకు రావాలి. ప్రతి గ్రామంలోని పార్టీ విభేదాలు నశింపుచేయాలి అవిధంగా గ్రామాలను బలిష్ఠంచేయాలి.

నాంతకులు, దోపిడిగాండ్రు అరాజకశక్తులను ఎవరికివారు, ఎక్కడికక్కడ ఎదుర్కొనే ధైర్యం శక్తి, యువకులు అలవర్చుకోవాలి ముఖ్యంగా గ్రామాలలో ధనవంతులూ భూస్వాములూ, తమపై ఆధారపడి ఉండే చిన్నకారుజనాన్ని బాగా చూడాలన్న సంగతి మరచిపోయారు వారి సంగతే పట్టించుకోవడం మానారు. వారూ మానవులేనని, వారి కష్టసుఖాలలో సాయపడాలనే ఈ అలవాటు ముఖ్యంగా ఈ సర్కారు ప్రాంతంలో పోయింది. యువకులందరూ దేశంలో అరాచకశక్తులను రూపుమాపేవరకూ ఏ పదవీ ఆశింపరాదని శపథం చేయాలన్నారు.

శ్రీ సత్యనారాయణగారు మాట్లాడుతూ, యువజన కాంగ్రెసువారు, ప్రతి గ్రామంలోనూ, గ్రామాభివృద్ధికి నడుంకట్టి పనిచేసే యువకదళాలను, కనీసం గ్రామానికి 10 మంది చొప్పున ఏర్పర్చాలి. ఈలా నాలుగైదు గ్రామాల తాలూకు దళాలవారు కలసి, ఏదో ఒక గ్రామంలో జనానికి ఉపయోగించే నిర్మాణ కార్యక్రమంలో పాల్గొంటూఉంటే ఆ గ్రామప్రజలు తప్పక తామూ ఆ కార్యక్రమాలలో పాల్గొంటారు. ఈ విధంగా ప్రతి జిల్లాలోనూ పిలుపు వినవచ్చేసరికి కనీసం 5 వేల మందిని హాజరుచేయగలిగే విధంగా యువజనకాంగ్రెసు కార్యకర్తలు పనిచేయాలి ఈ కార్యకర్తలూ, సభ్యులూ, నిర్మాణ కార్యక్రమాలలో తాము పాల్గొంటూ, గ్రామస్థులు పాల్గొనేట్లు ఉత్సాహపరుస్తూ సేవ చేయాలి. నేడు జాతీయ వికాస కార్యక్రమాలు ప్రజా సహకారంలో జరుగుతున్నాయని ఊరకే అనడమే గాని, నిజంగా అవి సర్కారు సొంత డబ్బుతో మాత్రమే జరుగుతున్నాయి. అలా కాకుండా నిజమైన సహకారం లభించేట్లు చూడాలి అన్నారు.

శ్రీ కుదరవల్లి విశ్వేశ్వరరావుగారు కూడా ప్రసంగించారు మధ్యాహ్నం జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో, పట్టణ కాంగ్రెసువారు శ్రీ తిమ్మారెడ్డిగారికి అల్పాహారవిందు చేశారు

### తిమ్మారెడ్డిగారికి కృతిసమర్పణ

ఏలూరు, సెప్టెంబరు 27 నేడిచట జరిగిన ప. గోదావరిజిల్లా యువజన కాంగ్రెసు వార్షికసభ సందర్భంలో సభాప్రారంభోత్సవం చేసేందుకు యిక్కడకువచ్చిన ఆంధ్ర స్థానికపరిపాలన-వ్యవసాయశాఖలమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డిగార్కి, యువజనకాంగ్రెసువారిచే ప్రచురింపబడిన "అల్లూరి సీతారామరాజు" అను నాటకము నాటకరచయిత యువకవి శ్రీ గబ్బిట వెంకటరావుగారిచే కృతి యివ్వబడింది. సమావేశం హిందూ యువజనసంఘ గ్రంథాలయంలో జరిగింది. ఆంధ్ర రాష్ట్ర యువజనకాంగ్రెసు అధ్యక్షులు శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు

కృతి అందుకుంటూ శ్రీ తిమ్మారెడ్డిగారు, యువజనకాంగ్రెసువారు తన యందుంచే వాత్సల్యంతో కృతికన్యను కూడా యిచ్చినందులకు కృతజ్ఞత తెలుపుతూ, ఆంధ్రమాత ముద్దుబిడ్డయైన అల్లూరి సీతారామరాజు దివ్యగాథను ఆంధ్ర ప్రజానీకానికి ఈ రూపంగా అందించిన కవి వెంకటరావుగారిని ప్రశంసించారు.

శ్రీ కమ్ముల సుబ్బయ్యగారు మాట్లాడుతు, ఈ నాటకమును సొంతంగా ముద్రించియిచ్చిన శ్రీ ఈదర వెంకట్రామయ్యగార్కి కృతజ్ఞత తెలిపారు శ్రీ ఈదర వెంకట్రామయ్యగారుకూడా మాట్లాడారు కవిగారంత కృతిని సమర్పించగా, శ్రీ తిమ్మారెడ్డిగారు వారిని శాలువతో సత్కరించారు అనంతరం యువజనకాంగ్రెసువారు కవిగారికి రు. 116/-లు యిచ్చి సత్కరించారు

కృతి సమర్పణానంతరం నాట్యాచార్య శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి నాట్యమండలివారు నాటకాన్ని ప్రదర్శించారు

# తెనాలితాలూకాలో విపరీత నష్టం

## వరిచేలు, అరటి, పసుపుతోటలు నాశనం

తెనాలి, సెప్టెంబరు 29 క్రితం మూడురోజులనుండీ, యీ ప్రాంతంలో సంభవించిన అతివృష్టిమూలంగా వరిచేలకు, అరటి, పసుపుతోటలకు విపరీతనష్టం సంభవించినది. వం × ం, జాగర్లమూడి పడమరదిశగా ప్రవహించిన వెల్లువ శేకూరు, కొలిపాకు, వడ్లమూడి, యడ్లపల్లి, అంగలకుదురు ప్రాంతములలో తోటలు చేలు ముంచెత్తివేసింది పైర్లపై 6 అడుగులనీరు పారుతున్నది

నిన్న రాత్రినుండి ప్రవాహవేగం విస్తరించి, రోడ్లపైని గజం ఎత్తున నీరు ప్రవహిస్తున్నది కొలకలూరు పశ్చిమ భాగమంతా జలమయమైపోయింది. అదు పేట, వెంకటకృష్ణాపురం, ఉప్పలపాడు, చవిటిరెడ్డిపాలెం మొదలైన పల్లెలన్నీ మునిగిపోయి, ఆ ప్రాంతాలలో నివసించే పేదప్రజలు వ్యవసాయకూలీలు ఊళ్ళువదలి పోయారు

తెనాలిపట్టణంలో వర్షపునీరు వరదలా ప్రవహించింది

# మంత్రి మండలిపై అభిశంసన తీర్మానాలు

## కర్నూలు జిల్లా కాంగ్రెస్ సంఘ వివర్శ

కర్నూలు, సెప్టెంబరు 30 అక్టోబరు 29 నాడు ప్రారంభం కానున్న శాసనసభ సమావేశంలో ప్రభుత్వంపై అభిశంసన తీర్మానం తేవడానికి నిర్ణయించిన కృషికార్ లోక్ పార్టీ, కమ్యూనిస్టు పార్టీల వైఖరిని ఖండిస్తూ, కర్నూలు జిల్లా కాంగ్రెసు కార్యవర్గం నిన్న సాయంత్రం సమావేశమై ఒక తీర్మానం చేశారు. ప్రకాశంగారి ప్రభుత్వాన్ని పూర్తిగా బలపరుస్తూ, ఆంధ్రలో ప్రజాస్వామిక ప్రభుత్వం సవ్యంగా కొనసాగడానికి సాయపడవలసిందని శాసనసభలోని ప్రజాస్వామిక పక్షాలనన్నిటినీ కోరారు.

పెండేకంటి వెంకటసుబ్బయ్యగారు ఈసమావేశానికి అధ్యక్షతవహించారు ప్రత్యేకాహ్వానంపై పీడతల రంగారెడ్డిగారు కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు.

జిల్లా రాజకీయ మహాసభను నవంబరు రెండవ వారంలో కర్నూలునందు జరపడానికిన్ని, దానిని ప్రారంభించడానికి మద్రాసు ముఖ్యమంత్రి కామరాజనాడారుగారినీ, అధ్యక్షతకు బెజవాడ గోపాలరెడ్డిగారినీ ఆహ్వానించడానికిన్ని నిర్ణయిస్తూ కార్యవర్గం మరొక తీర్మానం చేశారు. పతాకావిష్కరణకు హైదరాబాదు మంత్రి డా॥ చెన్నారెడ్డిగారిని పిలవడానికి కూడా వారు నిర్ణయించారు.

రాజకీయ బాధితులకు భూముల మంజూరు సందర్భంలో 18 వ తేదీ నాడు నిరశనదీక్ష ఆరంభించిన గాడిచర్ల [illegible] రాజా విశ్వనాథరాజుగారిని దీక్ష విరమించవలసిందిగా కూడ ఈ సభవారు కోరారు (స్వవి)

# మోపిదేవిలో కమ్యూనిస్టులదాడి

## జామీనుపై 19 మంది విడుదల

బందరు, సెప్టెంబరు 28 నెల మోపిదేవిలో జరిగిన కొట్లాటలో 25 మంది ముద్దాయిలకు ఒక్కరు మినహా అందరు దొరికారు (1) కంఠంనేని చిదంబరరావు (2) రావి పూర్ణచంద్రయ్య (3) ఈదిరపతియ్య కొడుకు కృష్ణయ్య (4) ఈ వెంకటసుబ్బయ్య (5) కొండలపాటి తిరుమలనీడు గార్లు యిటీవలనే అవనిగడ్డ సబ్ మేజస్ట్రేటు గారికి లొంగిపోయి అవనిగడ్డ సబ్ జైలులో యున్నారు. ఈ పైవారుగాక సబ్ జైలులోయున్న మిగతా 19 మంది తరఫున సెషన్సు కోర్టులో జామీనులకు పిటిషన్ దాఖలు చేయగా జడ్జి శ్రీ బి. కృష్ణారావుగారు 19 మందికి జామీను మంజూరుచేసి ఒక్కొక్క ముద్దాయిస్వంతంగా రూ 500/-కూ, మరి యిద్దరుచే అట్టి మొత్తములకూ బాండ్లు నివ్వాలని ఉత్తర్వులు చేశారు ముద్దాయిల తరఫున అడ్వకేట్లు వై. నాగభూషణం, కె. మద్ది రామయ్యగార్లు వాదించారు ప్రాసిక్యూషన్ తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటరు కె. వి. మల్లికార్జునగారు జామీను యివ్వతగదని వాదించారు జామీనుపై విడుదల చేయబడినవారు. (1) రావి సత్యనారాయణ (2) ముమ్మనేని సూర్యనారాయణ (3) యార్లగడ్డ రాఘవయ్య (4) రావి వెంకటకృష్ణయ్య (5) కొత్తపల్లి వెంకటేశ్వరరావు (6) యం. రాధాకృష్ణ (7) రావి రాజయ్య (8) యార్లగడ్డ శివరామయ్య (9) రావి వెంకట్రామయ్య (10) కోనేరు రాజగోపాలరావు (11) కంఠంనేని అచ్యుతరామయ్య (12) రావి జనకయ్య (13) యార్లగడ్డ రాఘయ్య (14) జొన్నలగడ్డ వెంకటరత్నం (15) రావి వెంకటసుబ్బయ్య (16) కంఠంనేని నారయ్య (17) రావి కోటయ్య (18) వేములపల్లి నాగేశ్వరరావు (19) కొల్లూరి కోటేశ్వరరావులు

# పత్రికా రచయితలకు కార్మిక వివాదాల చట్టం వర్తింపు

## ఈ నెలాఖరులోగా నిర్ణయం జరుగుతుందని లోక్‌సభలో మంత్రి హామీ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30 ఈ వేళ లోక్ సభలో ప్రశ్నోత్తరాల సమయమున పలువురు సభ్యులు ప్రెస్ ట్రస్టు ఆఫ్ ఇండియా ఉద్యోగీయుల పరిస్థితులను గూర్చి ప్రశ్నించారు

శ్రీ డి. సి. శర్మ అడిగిన ప్రశ్నకు కార్మికశాఖ డిప్యూటీమంత్రి ఆబిదాలి సమాధానమిస్తూ పి. టి. ఐ. నిర్వాహకవర్గము మున్ను ఉద్యోగులన్నూ సమాజకిపై పరిష్కారం కాకుండా వున్న తగాదా లన్నిటినీగూర్చి చర్చించి ఉభయులకు సంతృప్తికరమైన ఒప్పందానికి రావాలని సూచించారు.

పి. టి. ఐ. ఉద్యోగులు 'గోర్కెల వారము' ను జరిపారని తెలుసు నిజమే కాని లాంఛనంగా సమ్మె చేయడానికి పి. టి. ఐ. ఉద్యోగుల సమితి జనరల్ కమిటీలు ఆదేశించిందో లేదో ప్రభుత్వానికి తెలియదు పత్రికా రచయితలను (వర్కింగ్ జర్నలిస్టులు) పారిశ్రామిక తగాదాల చట్టం వ్యాప్తికిందికి తీసుకుని రావాలని ప్రెస్ కమిషను సలహా యిచ్చింది పత్రికా పరిశ్రమలో ఉత్పన్నమయ్యే తగాదాలను పరిష్కరించ బాధ్యత కేంద్రప్రభుత్వము వరిదైవుండాలనికూడా ప్రెస్ కమిషను సలహా యిచ్చింది. ఈ సలహాలు యిప్పుడు పరిశీలనలో వున్నాయి.

శ్రీ శర్మ జర్నలిస్టులను పారిశ్రామిక తగాదాల చట్టంలోని 'కార్మిక' పద నిర్వచన వ్యాప్తి క్రిందికి తీసుకొని రావడానికి కృషి జరుగుతుందని మాజీ కార్మికశాఖ మంత్రి శ్రీ వి. వి. గిరి హామీ యిచ్చారా?

శ్రీ ఆబిదాలీ ఈ విషయాన్ని ప్రభుత్వంవారు శ్రద్ధగా విచారిస్తున్నారు ఆక్టోబరు మాసాంతంలోపుగ నిర్ణయం జరుగుతుందని ఆశిస్తున్నాము

శ్రీ శర్మ పి. టి. ఐ. ఉద్యోగులన్ను యజమానులున్ను చర్చలద్వారా జీతాలు, అలవెన్సుల విషయమై యేర్పడిన తగాదాను పరిష్కరించుకు నేటట్లు ప్రభుత్వంవారు మాస్తారా యజమానులున్ను ఉద్యోగులన్ను చేసుకున్న తాత్కాలిక ఒప్పందము ననుసరించి యిట్టి చర్చలద్వారా తగాదా పరిష్కారం కావలసివున్నదిగదా!

ఆబిదాలీ. మా సూచనలను ఉభయ పక్షాలవారు అంగీకరించ సిద్ధంగా వున్నట్లయితే మేము వంతోషపూర్వకంగా సహాయంచేస్తాము

శ్రీ టిం. ఎస్. సింగ్. సమాచారశాఖ మంత్రికిన్ని పి. టి. ఐ. యజమానులకున్ను మధ్య యిదివరకే సంభాషణలు జరిగినవా? తమకు తగినంత ద్రవ్యంలేదని యజమానులు చెప్పిన మాట వాస్తవమేనా?

అధ్యక్షుడు ఈ ప్రశ్నను నిరాకరించారు సమాచారం తెలుసుకోవడానికి ఉపప్రశ్నలు వేయాలిగాని సమాచారం తెలపడానికి ప్రశ్నలు వేయకూడదని అధ్యక్షుడు అన్నారు

శ్రీ విఠల్ రావు. ఇట్టి చిక్కులు యేర్పడకుండా వుండడానికిగాను జీతాలు పుచ్చుకునే ఉద్యోగుల విషయమై చేసుకోనబడిన అంతర్జాతీయ లేబర్ కన్వెన్షన్ను ప్రభుత్వం దృవపరచ సంకల్పిస్తున్నదా?

ఆబిదాలీ ఐ. ఎల్. ఓ కన్వెన్షన విషయమై ప్రభుత్వంవారి భావాలను వివరించే ప్రతమును యిదివరకే సభవారి బల్లపై వుంచాము."

# నెహ్రూ ప్రకటన

## పుదుచ్చేరిలో హర్షం

పుదుచ్చేరి, సెప్టెంబరు 30 ఫ్రెంచి స్థావరాల సమస్య సెలరోజుల్లో తేలగలదని లోక్ సభలో శ్రీ నెహ్రూ చేసిన ప్రకటనకు పుదుచ్చేరి పౌరులు హర్షం ప్రకటిస్తున్నారు ప్రస్తుతం జరుగుతున్న సంప్రతింపులు జయప్రదం కాగలవనికూడా ఆశిస్తున్నారు

రాజకీయంగా దూరదృష్టిని, వివేకాన్ని ప్రదర్శించినందుకు ఫ్రెంచి ప్రభుత్వాన్ని జాతీయవాదులు నాయకులు అభినందిస్తున్నారు అయితే స్థావరాలఅప్పగింతకుముందు వోటింగ్ జరిపితే రేమోనన్న సందేహం కూడా కొందరిలో కలుగుతోంది ఎందుకంటే దీనికి సంబంధించిన కొన్ని వివరాలు కొనవస్తున్నవి.

భారతీయ వ్యాపారులు గతమూడు రోజులుగా పుదుచ్చేరికివచ్చి బ్యాంకులలో డిపాజిట్లు కట్టుకున్నారు కొన్నికోట్ల రూపాయలు ఖరీదుచేసే సరుకుల దిగుమతి చేసుకోవాలని వీరు ప్రయత్నిస్తున్నారు ఈ సరుకులలో చాలాభాగం భారతదేశానికి రావడం నిషేధించబడినవి

# ఆంధ్రలక్ష్మి రైసుమిల్లు కార్మిక తగాదా

కర్నూలు, సెప్టెంబరు 30 ఉద్యోగంనుంచి ఒక పనివాని తొలగింపుపై కృష్ణాజిల్లా కవిటరంలోని ఆంధ్ర లక్ష్మి రైసుమిల్లు యజమానులకూ, కార్మికులకూ మధ్య ఏర్పడ్డ తగాదాను ఆంధ్రప్రభుత్వం వారు పారిశ్రామిక ట్రిబ్యునల్ పరిష్కారానికి పంపించారు విశాఖపట్నం సమావేశంలో ఇది విచారణకు వస్తుంది.

# గుంటూరు క్రైస్తవ కళాశాల

## పౌరశిక్షణాసంఘం

గుంటూరు, సెప్టెంబరు 29 ఆంధ్ర క్రైస్తవ కళాశాల బి. యి. డి. విద్యార్థుల పౌరశిక్షణ కేంద్రాన్ని విద్యాశాఖ అవరణలో వైద్య కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ బి. జగన్నాథరెడ్డిగారు ప్రారంభిస్తూ దేశంలో సరైన పౌరుల ఆవశ్యకతను వివరించారు ఎన్నికల విషయంలో పౌరులు ధైర్యాన్ని ప్రదర్శించి, సరైన వ్యక్తులను ఎన్నుకోటానికి విధిగా తయారుకావాలన్నారు ఈ ఎన్నికలమీదే ఇండియాలోని ప్రజాస్వామిక స్వరూపం ఆధారపడి ఉండటంవల్ల, పౌరులు ఎన్నుకోటంలో చాలా జాగ్రతవహించటం ఎంతైనా అవసరం అన్నారు మానవ విలువలకు బాగా ప్రాధాన్యత నిచ్చేవిధంగా ప్రతి పౌరుని తయారుచేయ్యాలన్నారు

అడ్వకేట్ టి. అనంతబాబుగారు ప్రతిపౌరుని హక్కులను, బాధ్యతలను గురించి మాట్లాడారు

జిల్లా పోలీసు సూపరింటెండెంటు గోపనగారు చట్టాలు, శాసనాలుకన్నా, నీతి పెరగవలసిన అవసరాన్ని పేర్కొన్నారు. శాసనాలుకన్నా, నీతినియమాలు మానవునికి దారిచూపవలసి ఉందన్నారు

క్షయ ఆసుపత్రి డాక్టర్ ఒక్కగారు ప్రథమచికిత్సను గురించి మాట్లాడారు

ఈ కేంద్రంలో రెండు తరగతుల భోజన వసతులు ఏర్పాటైనాయి ఒకటి శాకాహారులకు, మరొకటి మాంసాహారులకు పౌరశిక్షణలో ఇది గమనించదగ్గ విషయం.

ఏ. సి. కళాశాల బి. యిడి శాఖాధిపతి డా॥ ఏ. టి. ఫ్రెస్‌మన్ సిబ్బందితో డ్పాటులో ఈ కేంద్రాన్ని ఏర్పాటుచేశారు (స్వవి)

# టెలిఫోను సౌకర్యాల విస్తరణ

కడప, సెప్టెంబరు 28 పురపాలక సంఘం ప్రాంతంలోని ఇక్కడి రహదారి బంగాళాకు టెలిఫోన్ సంబంధం ఏర్పరచాలన్న అధ్యక్షుని తీర్మానాన్ని కడప పురపాలసంఘం ఆమోదించింది ఇక్కడికి నాలుగుమైళ్ళ దూరంలోఉన్న రావులకొలనులోని శేషయ్య వాటర్ వర్క్సుకుకూడా ఈ సౌకర్యం ఏర్పాటు చేయబడుతుంది బంగళాలో టెలిఫోన్ కనెక్షన్ కు 285 రూ మంజూరు చేయబడినాయి. వాటర్ వర్క్సువద్ద టెలిఫోన్ కు 10 ఏళ్ళ గ్యారంటీ ఇవ్వటానికి సంఘం అంగీకరించింది

# రైలులో బ్రిటిష్ మహిళ హత్యకేసు

## ఇద్దరిపై విశాఖపట్నంలో ఛార్జిషీటు దాఖలు

విశాఖపట్నం, సెప్టెంబరు 30 ఆంధ్ర సి. ఐ. డి. పోలీసులు విశాఖపట్నం జుడిషియల్ జిల్లా మేజిస్ట్రేటువద్ద సెప్టెంబరు 25 వ తేదీని నాగపూరు నివాసి మహేంద్రసింగ్ అనే 20 యేండ్ల రాజపుత్రుని పేరను తూర్పుగోదావరికి చెందిన షరీఫ్ చేయుబడి పోలీసు బంట్రోతు యం. కె. షరీఫ్ ఉల్ లాల్ అనే వానిమీదను వారు ఆగస్టు 21 వ తేదీ కలకత్తా మెయిలునందు రెండవతరగతిలో ప్రయాణం చేస్తూ ఉండిన బ్రిటిషు స్త్రీ మిస్ ఇ. కొప్పును హత్యచేశారనే నేరము నకై ఇండియన్ పీనల్ కోడు సెక్షన్లు 302, 329, 75 క్రింద అభియోగపత్రము దాఖలు చేశారు

ఈ బ్రిటిష్ స్త్రీ పాకిస్థాన్ లో ఒక ఆసుపత్రి యందు నర్సుగా ఉండి సెలవుపై కలకత్తా వెళ్లి అక్కడ నుండి కూనూరుకు విలాసముగా వెళ్లుచుండినదనియు ఆమె చెంత రూ 480 అపుడు ఉండినదనియు తెలియుచున్నది ఈ స్త్రీని సజీవంగా ఆగస్టు 21 వ తేదీని మాచిన అనకాపల్లి అసిస్టెంటు సేషను మాస్టరు, విశాఖ పబ్లిక్ ప్రాసిక్యూటరు పాకిస్థానులోని ఆసుపత్రి నర్సులిద్దరు మొదలైనవారు మొత్తం 50 మంది యీ కేసులో ప్రాసిక్యూషనుతరఫున సాక్షులుగా పేర్కొనబడి యున్నారు. ఈ బ్రిటిష్ స్త్రీ చెంతనుండిన మొత్తం రూ 480 లో రూ 110 ముద్దాయి స్నేహితుని వద్ద పోలీసులకు దొరికినవట

# జూలకల్లు హత్యకేసు

## ముద్దాయిల విడుదల: కర్నూలు జడ్జీ తీర్పు

కర్నూలు, సెప్టెంబరు 29 జూలకల్లు హత్యకేసులో ముద్దాయి లందరినీ విడుదలచేస్తూ కర్నూలు సెషన్సు జడ్జి మొన్న 25-వ తేదీ నాడు తీర్పు చెప్పారు ఈ కేసులో 7 మందిపైన హత్య, దొమ్మి, అక్రమ సమావేశం, మారణాయుధాల ధారణ నేరాలు మోపబడినవి.

ఈ కేసు విచారణలో పాల్గొన్న ముగ్గురు అసెసర్లూ ముద్దాయిలు నిర్దోషులని అభిప్రాయం వెల్లడించారు సెషన్సు జడ్జిగారి అభిప్రాయంతో ఏకీభవించి అందరినీ విడుదలచేశారు

యాదిగ నీలప్ప, బి. తిమ్మారెడ్డి, మాదిగ రంగన్న, హనుమంతు, బైని హనుమంతు, మాదిగ శేషన్న, బోయ హనుమంతు అనే కర్నూలు తాలూకా జూలకల్లు వాస్తవ్యులైన 7 గురు ముద్దాయిలూ 1954 ఏప్రిల్ 6-వ తేదీనాడు అక్రమ సమావేశంగా చేరి, కుట్రపన్ని, కురువ హనుమన్న అనేవాని చిత్రహింస చేసి చంపినట్లు పోలీసువారు వీరిపై ఛార్జిషీటు పెట్టారు. ముద్దాయిల్లో ఎవ్వరూ దోషులు కారని అసెసర్లు ఏకగ్రీవంగా తీర్మానించారనీ, వారితో ఏకీభవిస్తున్నాననీ, నిందితులపై నేరాలను పోలీసువారు సరిగా నిరూపణచేయలేకపోయారనీ జడ్జీ తమతీర్పులో పేర్కొన్నారు

# కడప పెన్నా హెడ్‌వర్క్స్ అభివృద్ధి వ్యయం

## పూర్తిగా తామే భరించడానికి కడప పురపాలకసంఘ నిర్ణయం

కడప, సెప్టెంబరు 27: కడప పెన్నార్ హెడ్‌వర్క్సు అభివృద్ధి ప్రణాళికకు కాగల ఖర్చు అంతటినీ భరించడానికి కడప పురపాలక సంఘం నిర్ణయించింది గత శనివారంనాడు చైర్మన్ శ్రీ మహమ్మద్ రహంతుల్లా అధ్యక్షతన జరిగిన అత్యవసర సమావేశంలో ఈ నిర్ణయం చేయబడింది

ఈ విషయంలో ఛీఫ్ ఇంజనీరు చేసిన సూచనలను వివరిస్తూ శ్రీ రహంతుల్లా, ప్రస్తుత నీటిసరఫరాకు ఉన్న వనరులు చాలవని కాని, దీనిని తోడటానికి బావికి కలిపే సైఫన్ పంపు చాలా పాతబడిపోయిందనీ ఇంజనీరు చెప్పినట్లు తెలియబరిచారు వరదలకు నదిలోయక్కువగా వచ్చే యిసుకవల్ల సైఫనుపంపు బయట పడి సరిగా పని చెయ్యటంలేదు. ఈ సైఫన్‌పంపు 1400 అడుగుల పొడవు ఉన్నది. అందుచేత ఛీఫ్ ఇంజనీరు 400, 450 అడుగుల కొకటి చొప్పున నీరు పట్టుకునే బావులను త్రవ్వాలని, సైఫన్‌పంపు లెవల్ తగ్గించాలని సూచించారు ఈ ప్రణాళిక క్రింద మొదటి దశగా నీరు తోడే బావినుంచి 450 అడుగుల దూరంలో ఒక 8 అడుగుల జలదావి బావి త్రవ్వటం, ఈ బావిని నీరుతోడే బావికి కలుపుతూ 14 అంగుళాల సైఫను పంపును ఇప్పటి పంపుకంటే లోతుగా ఏర్పాటు చేయటం, ఆ మధ్య ఉన్న ప్రస్తుత పంపు భాగాన్ని తీసివేసి ఈ పంపును లెక్కడదానితో కలపటం జరుగుతుంది ఇందుకుగాను 42 000 రూపాయల అంచనా వేయబడింది రెండవ ఘట్టంలో నీరుతోడే బావికి 900 అడుగుల దూరంలో 8 అడుగుల బావిని త్రవ్వి మొత్తం సైఫనుపంపు 7 అడుగులు క్రిందికి ఉండేటట్లు చేయటం పంపు హౌస్ ను పునర్నిర్మించటం జరగాలి ఈ విషయాలను చైర్మన్ సభ్యుడు శ్రీ శ్రీనివాసాచారి యీ ప్రణాళికను పురపాలకసంఘం డబ్బుపెట్టి అమలు జరపటానికి అభ్యంతరం చెప్పారు ప్రభుత్వం ఇందులో సగం గ్రాంటుగా, సగం ఋణంగా మంజూరుచేస్తేనే నిర్మించాలని ఆయన చెప్పారు

ప్రభుత్వం అలా కొన్ని పురపాలకసంఘాలకు ఇస్తున్నట్లు తెలిపిందనికూడా ఆయన అన్నారు అధ్యక్షులు సమాధానంచెప్తూ, ఎక్కడా అలా జరగలేదని, రాష్ట్రప్రభుత్వమే ఒక ప్రత్యేక తమ అవసరాలకే కేంద్రంనుంచి అప్పు తెచ్చుకుంటున్నదనీ అన్నారు. కొంతసేపు చర్చ జరిగినపిమ్మట మిగిలిన సభ్యులు ఈ ప్రణాళికను 42,000 వ్యయంతో అమలుజరపటానికి నిశ్చయించారు ఆ చర్చలో ఇంతకుముందు అధ్యక్షులుగా ఉండిన పి. శేషయ్య చెట్టిగారుకూడా పాల్గొన్నారు

అయితే ఈ వ్యయాన్ని కూడా 11 25 లక్షల రూపాయల విస్తృత ప్రణాళిక క్రింద చేర్చాలని ప్రభుత్వాన్ని కోరటానికి సంఘంవారు నిశ్చయించారు. ప్రస్తుతంఉన్న పంపు సెటు పనికి బదులు 'వంకల్ వాల్వు' పద్ధతిని సెంట్రిఫ్యూగలు పనికి ప్రముఖ ప్రాధాన్యం ఇవ్వాలనికూడా ప్రభుత్వాన్ని కోరాలని పురపాలక సంఘంవారు తీర్మానించారు.

# ప్రజలు స్వయంగా నిర్మించిన అటికలగుండు రోడ్

## అభివృద్ధిశాఖ కమిషనర్ ప్రారంభోత్సవం

పత్తికొండ, సెప్టెంబరు 28 అటికల గుండు గ్రామప్రజలు స్వయంగా నిర్మించుకొన్న రోడ్డుకు అభివృద్ధిశాఖ కమిషనర్ శ్రీ బి. నటరాజన్ ప్రారంభోత్సవం జరిపారు అడవాని, బళ్లారి రోడ్లతో కలుపుతూ గ్రామస్థులు నిర్మించుకొన్న ఈరోడ్డుకు ప్రభుత్వం వారు 5000 రూ లగ్రాంటు ఇచ్చినట్లు తెలుస్తున్నది జాతీయ వికాస ప్రణాళిక క్రింద చేర్చని ప్రాంతంలో కూడా ఇలా స్వయం సహాయంతో కృషిచేయటం ప్రశంసనీయమని శ్రీ నటరాజన్ గ్రామస్థులను అభినందించారు ప్రజాస్వామ్య పరిపాలనకనుక ప్రజలనుండి వసూలుచేసిన సొమ్మును ప్రజలకే వినియోగిస్తున్నామని, ఈవికాస ప్రణాళిక జయప్రదం కావాలంటే ప్రజలు ఉత్సాహంతో, సహకారంతో పనిచేయాలని ఉద్బోధించారు సర్కిల్లో జాతీయ వికాస కార్యక్రమాలు రాష్ట్రమంతటా వ్యాపింపజేయగలనని కూడా ఆయనచెప్పారు.

కర్నూలు జిల్లా కలెక్టరు జనాబ్ సయ్యద్ అహ్మద్ ప్రణాళికా శాఖాధికారి శ్రీ జె. నారాయణశెట్టి, శాసనసభ్యులు పెంచ్. రామలింగారెడ్డిగారలు పాల్గొన్నారు. శ్రీ యస్. నరసింహారెడ్డిగారు నటరాజన్ గారికి స్వాగతపత్రం సమర్పించారు కమిషనరుగారి ఆంగ్లోపన్యాసాన్ని శ్రీ పెంచ్. కృష్ణమూర్తిగారు తెనుగు చేశారు.

పత్తికొండ అడవాని రోడ్డులోని హంద్రి వల్లవాగు వంతెనల నిర్మాణం పూర్తిచేయించాలని కోరుతూ శ్రీ వై. వెంకటరత్నంగారు వినతిపత్రం సమర్పించారు

పుస్తక భాండాగార భవనానికి జిల్లా కలెక్టరు శంకుస్థాపన చేశారు పుస్తక భాండాగారానికి జిల్లా ప్రణాళికా శాఖాధికారి ప్రారంభోత్సవం చేశారు

ఈసందర్భంలో అల్పాహార విందు జరిగింది.

# కాశీ విశ్వనాథ ఆలయంలో హరిజన ప్రవేశానికి నిర్ణయం

## థక్కర్‌బాపా నిర్యాణదినం కార్యక్రమం: భారత హరిజనసేవక్ సంఘ తీర్మానం

ఢిల్లీ, సెప్టెంబరు 29 అస్పృశ్యతా నివారణార్థం కేంద్రబడ్జెటులో మంజూరైన మొత్తంలో కొంత కేంద్ర హరిజనసేవా సంఘానికి ఇచ్చి, మిగతాది ప్రాంతీయ ప్రభుత్వాలద్వారా ఖర్చుచేయటంకన్నా ప్రయివేటు సంస్థలద్వారా కార్యక్రమాన్ని నిర్వహించటం మంచిదని అఖిలభారత హరిజనసేవాసంఘం నిర్ణయించింది

అఖిలభారత హరిజనసేవక సంఘ వార్షిక సమావేశం 25 26 తేదీలలో హరిజన కాలనీ కింగ్స్ వేలో జరిగింది శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ అధ్యక్షత వహించారు

శ్రీమతి రామేశ్వరీనెహ్రూ, ఆర్. డి. థోత్రే, శ్యామలాల్, శ్రీకృష్ణదాస్ జాజూ మొదలైనవారు పాల్గొన్నారు. ఆంధ్రనుంచి నేతి వెంకటాచలపతి; ఆర్. కె. రామలింగారెడ్డి గారలు హాజరైనారు.

కాశీలోని విశ్వనాథ దేవాలయంలో హరిజనులను ప్రవేశపెట్టటానికిగాను ఒక ఉపసంఘాన్ని నియమించింది ఈ ఉపసంఘం మూడుమాసాలలోపల దేవాలయంలో హరిజనుల ప్రవేశం విషయం అన్ని ప్రయత్నాలు చేస్తుంది ప్రయత్నాలు విఫలమైతే హరిజనపిత ఠక్కర్ బాపాగారి నిర్యాణదినంనాడు (1955 జనవరి 19 వ తేదీ) అహింసాయుతంగా దేవాలయ ప్రవేశ ప్రయత్నాలు చేయటానికికూడా నిశ్చయించారు

పంజాబు ప్రభుత్వం మృతపశువులను తమపరంచేసుకోదలచిన చట్టం జనసమ్మతంగా ఉండేలాగు, మృతపశువుల సద్వినియోగ కార్యక్రమం ఒక సహకారపద్ధతిమీద నడిపేటట్లు చూడాలని కోరారు.

నిన్న హాయంత్రం సభ్యు లందరూ రాష్ట్రపతి భవనంలో రాష్ట్రపతిని కలుసుకొన్నారు హరిజనసేవక సంఘ ప్రధానమంత్రి వియోగి హరిగారు సమావేశనిర్ణయాలు, హరిజనుల ఇక్కట్లు వారికి వివరించారు. స్వామి సీతారామ్ గారి ఆరోగ్యాన్ని గురించి నేతి వెంకటాచలపతి గారి నడిగి తెలుసుకున్నారు అటుతర్వాత సభ్యులు రాజఘాటులో గాంధి సమాధిని సందర్శించారు మొదటిరోజు సాయంత్రం హరిజనసేవక సంఘం తరఫున అల్పాహారవిందు చేయబడింది సుప్రీంకోర్టు జడ్జి బచ్చు జగన్నాథదాసు, మావలంకర్, డిప్యూటీమంత్రి దాతార్, రవాణాశాఖమంత్రి జగజీవన్ రామ్ గారలు, మరికొందరు పార్లమెంటు సభ్యులు పాల్గొన్నారు.

# హైద్రాబాద్ కాంగ్రెసు రెండవ కార్యదర్శి

## నియామకం విషయమై తర్జన భర్జనలు

హైదరాబాదు, సెప్టెంబరు 29: ప్రదేశ్ కాంగ్రెసు సహాయ కార్యదర్శి నియామకం విషయమై యింకా తర్జనభర్జనలు జరుగుతున్నట్లు తెలుస్తున్నది మల్లప్ప కొల్లూరుగారు (ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు) ఢిల్లీ వెళ్ళేముందు రాష్ట్ర ముఖ్యమంత్రి, మాజీ అధ్యక్షుడు శ్రీ రంగారెడ్డి (రెవిన్యూ మంత్రి), పి. డబ్ల్యు. డి. మంత్రి డాక్టరు జి. ఎస్. మేల్కోటే, ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు శ్రీ ఎస్. కొన్నారెడ్డి, మరికొందరు ప్రముఖ ప్రదేశ్ కాంగ్రెసు నాయకులతో యీ విషయమై సంప్రదింపులు జరిపినట్లూ కాని ఏ విధమైననిర్ణయమూ తీసుకోనట్లూ తెలుస్తున్నది.

ప్రదేశ్ కాంగ్రెసుకు ఇద్దరు కార్యదర్శులను నియమించుట ఆచారము కర్ణాటక ప్రతినిధి అధ్యక్షుడైనప్పుడు మరాట్వాడా, తెలంగాణాలకు కార్యదర్శి పదవులివ్వటం ఆచారసిద్ధము. మల్లప్పగారు ఎన్నికయి మూడుమాసాలు పూర్తవుతున్నా ఇంతవరకూ రెండవ కార్యదర్శి నియామకం జరుగలేదు వీరి అధ్యక్షత పదవి డిసెంబరుతో పూర్తికాగలదు. 1955 జనవరిలో తిరిగి అధ్యక్షపదవికి ఎన్నికలు జరుగవలసియున్నది ఈమూడుమాసాల కోసం యింకొక కార్యదర్శిని నియమించక పోవచ్చునని కాంగ్రెసువర్గాలలో ఊహింపబడుచున్నది శ్రీఎస్. చెన్నారెడ్డిగార్ని రెండవ కార్యదర్శిగా నియమిస్తారని అనుకున్నారు. ఆ పదవిని భర్తీచేయుపక్షమున రెడ్డిగారు ఆపదవిని పొందగలరని అనుకుంటున్నారు. (స్వవి)

# పాకిస్తాన్ పతాక ప్రతిష్ఠాపన అల్లర్లు

## బాధితులయెడ శాసన సభ్యుల ఔదార్యం

హైదరాబాదు, సెప్టెంబరు 30 కడచిననెల జరిగిన గుల్బర్గా, నిజామాబాదు కల్లోలాల్లో బాధితులైన వారి సహాయార్థం తమ ఒకరోజు భత్యాన్ని ఇవ్వడానికి హైదరాబాదు శాసనసభ పీపుల్సు డెమోక్రటిక్ ఫ్రంటు లెజిస్లేచరు పార్టీ సభ్యులు నిశ్చయించారు శాసనసభలో పి. డి. యఫ్ సభ్యుల సంఖ్య మొత్తం 40 ఒక్కొక్క శాసనసభ్యునికి ఇచ్చే రోజు భత్యం రు. 12-8-0.

ప్రధాని నెహ్రూ వరదనిధికి 100 రూ. లు ఇవ్వడానికికూడ ఈ పార్టీ సభ్యులు నిశ్చయించారు

# మధ్యప్రదేశ్‌లో పాక్ పతాకాలు

నాగపూరు, సెప్టెంబరు 29 పాకిస్థానీ పతాకాన్ని పోలిన అనుపద్ధని పతాకాలు సాగరు జిల్లా సిరోంజీ తాలూకా గ్రామంలో అనేక ఇండ్లపైన దేవాలయంపైన, జానపద సభ కార్యాలయంపైన కూడా ఎగురవేయబడినవి అధికారులు వీటిని వెంటనే తొలగించారు

# ఇండొనీషియా ప్రధాని

## స్వదేశానికి తిరిగి చేరిక

జకార్తా, సెప్టెంబరు 29 ఇండొనీషియా ప్రధాని ఢిల్లీ, రంగూన్‌లను చూచుకొని నేడు ఇక్కడికి తిరిగి వచ్చేశారు.

ఈ రెండు రాజధానుల్లోను తాను నెహ్రూ శాంతి సూత్రాలను గురించి నెహ్రూతోను, థాకిన్‌నూతోను చర్చించానని, చైనావారు గనుక ఈ విషయంలో తమ్ము కదిపితే, తాము కూడా ఈ సూత్రాలను ఆమోదించడాన్ని గురించి ఆలోచిస్తామని, ఈయన ఈ సందర్భంలో తన్ను కలుసుకొన్న పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు

పెకింగులో నెహ్రూనా మంతనం ఏమైనా మాట్లాడమన్నారా అని ఒక విలేఖరి ప్రశ్నించగా, 'లేదు' అని అలీ శాస్త్రామిడ్జోజో సమాధానం ఇచ్చారు.

# విజయవాడ మార్కెట్ ధరలు

విజయవాడ, అక్టోబరు 1: ధాన్యం 166 సౌ॥ల బస్తా కుసుకు 31-4 ఢిల్లీ భోగాలు 22-8 0 అక్కుళ్లు 20-8 0 కె. 12 21-8-0 24 సెం 11 రు 24-8-0

బియ్యం: 246 సౌ॥ల బస్తా కుసుకు 48 8 0, ఢిల్లీ భోగాలు 51-8-0 అక్కుళ్లు 48 నుండి 49-8 0
24 సెం 11 రు 55-8-0.

పెరుశెనగ గింజలు.
177 సౌ॥ లు 45 రు.

పిట్టు 168 సౌ॥ 12 12-0 నూనె 25 సౌ॥ 14-4-0 నల్ల పెసలు 240 సౌ॥ల బస్తా లర్ పచ్చ పెసలు 22 రు కందులు 21 రు శెనగలు 230 సౌ॥ల బస్తా 30 రు లు ఉలవలు 22 24 రు మిర్చి మణుగు 17-8-0 బెల్లం 8-4 రు. కొబ్బరికాయలు వెయ్యి 120 రు కొబ్బరి నూనె డబ్బా 114 రు. లు ధనియాలు 90 సౌ॥ లు 25 రు లు

# మదరాసు ధరలు

మదరాసు, అక్టోబరు 1

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎడ్వర్డులోమ్ము సేల్సుటాక్సుతో సహా రు. 58-4-0
పెట్లాబంగారం తులం రు. 81-0-0
మూడు బంగారు రు. 86-4 0
సీమవెండి తులం100కి రెడి రు. 159-8-0
చిల్లర ధర రు. 1-10-6

వేరుశెనగ

(581 సౌ॥ 1-8 ఎక్స్ పోర్టు గిడ్డంగులు మెషిన్-సేల్సుటాక్సుతో సహా)
రు. 111-114

వేరుశెనగనూనె ఎక్స్ పెల్లర్ బిల్లో 8% (500సౌ.) రెడి చిల్లరధర రు.222-0-0

కొంకోయనూనె (37½ సౌనులు)
అంబుమార్కు రు. 83-8 9
ఎం ఎస్ బ్రాండ్ డబ్బా 80-8-9
రాజా రు 80-0-9

అనుదం

తిరుపత్తూరు (500 సౌ) రు 185-0-0

పందదార

| | | |
|---|---|---|
| జపాన్ | (56 సౌ) | 24-8-9 |
| క్యూబాన్ | (100 సౌ॥) | 86-8-9 |
| క్యూబాన్ | (250 సౌ॥) | 90-8-9 |

# బొంబాయిమార్కెట్

బొంబాయి, అక్టోబరు 1 ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు) | 157 0-0 |
| బంగారం (1 తు) | 87-0-0 |
| సావరిన్ | 57-10-0 |

కలకత్తా మార్కెట్ ధరలు: 157-4-0 87 6-0, 58 3-0

# న్యూయార్కు దూది

అక్టోబరు వాయిదాధరలు

న్యూయార్కు, సెప్టెంబరు 30 న్యూయార్కు కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి

| | |
|---|---|
| నేడు ప్రారంభ ధర | 35 18 |
| నేటి ముగింపు ధర | 35 13. |

